వేంకటకృష్ణరాయ, అన్నగారి

శ్రీరామకధాప్రతిపాదక ధైర్యశతకము

చెన్నపట్టణం, 1904

Record no. 363

Vēṅkaṭakṛṣṇarāya, Annagāri

Śrīrāmakadhāpratipādaka dhairyaśatakamu

Cennapaṭṭaṇaṃ, 1904

Record no. 363

## Bibliographic Record Target

వేంకటకృష్ణరాయ, అన్నగారి.

శ్రీరామకథాప్రతిపాదక ధైర్యశతకము / అన్నగారి వేంకటకృష్ణరాయచే రచియింపబడి, గొంగులూరి గుండోపాఖ్యకవిచే పరిష్కరించబడినది.- చెన్నపట్టణం : హిందూరత్నాకరముద్రాక్షరశాల, 1904.

22, 2, 2 p. ;20 cm.

Record no. 363

Vēṅkaṭakr̥ṣṇarāya, Annagāri.

Śrīrāmakadhāpratipādaka dhairyaśatakamu / Annagāri Vēṅkaṭakr̥ṣṇarāyacē raciyimpabaḍi, Goṅgulūri Guṇḍōpākhyakavicē pariṣkariñcabaḍinadi.- Cennapaṭṭaṇaṃ : Hindūratnākaramudrākṣaraśāla, 1904.

22, 2, 2 p. ;20 cm.

Record no. 363

శ్రీ ర స్తు.

---

# శ్రీ రామకథా ప్రతిపాదక ధైర్యశతకం.

ఇదిచదువనిచ్ఛయించెడు భగవద్భక్తుల కత్యంతోప
యుక్తముగా రామాయణకథానుసారముగా
హయిదరాబాదసమీపం బీబీనగరంపూర్వ
మున్ను ప్రస్తుతం బాగుఅంబరుపేట
లోనున్ను నివాసముగానున్న
అన్నగారి వేంకటకృష్ణ రాయ
నామధేయుండగు
భగవద్భక్తునిచే భక్తిమార్గముగా
రచియింపంబడి
తత్సమీప రామపల్లె నివాసుండగు
గొంగులూరి గుండోబాఖ్యకవిచే
బరిష్కరింపంబడి

చెన్నపట్టణం
పిడుగు - సుబ్బరామయ్యా అండుసన్ గార్ల
హిందూరత్నాకరముద్రాక్షరశాలయందు
గ్రంథకర్తవలననే మొదటితూరి
అచ్చుకూర్పించి ప్రచురింపంబడియె.

**1904**



శ్రీరస్తు.

---

శ్రీహనుమత్ సీతాలక్ష్మణ భరతశత్రుఘ్నసమేత

శ్రీరామచంద్రాయ నమః.

# శ్రీరామకథాప్రతిపాదక ధైర్యశతకము.

---

శ్రీకమలామనోల్లసిత శీలదయాపరపాహిపాహిలో । కైకశర
ణ్యదానవకులాంతక యోాయభయప్రదాతను । శ్లోకహ కేయటంచది
తిజుల్ గుణిగా మొరశేయ సన్నుతుల్ । గైకొను రామమూర్తి మన
కాంక్షలో సంగువిచారమేటికిన్ ॥౧॥ మనవి గ్రహింపవే కరుణామా
నక లోకములోన రావణుం। డనునొకదొడ్డదానవు డహర్నిశముల్ మ
ము బాధబెట్టుమే। మని మొనగెల్వజాలమని యారటబొందుసురాళి నా
దరిం। చినఘున రామమూర్తి మనచింతలు బాపు విచారమేటికిన్ ॥౨॥
ఏనవనిన్ జనించెద దినేశకులంబున మీరలంతమీ । మీనిజతేజము
ల్ కపులు మేదినిపై జనియింపశేయుడ । వ్వానరశేనతో గడశిబా
నివధించెదనంచునమ్మికల్ । బూనువు రామమూర్తి మన పోషణశే
యు విచారమేటికిన్ ॥౩॥ రవికులమందుపంక్తి రథ రాజకుమారు
లులేక చింతచే। సపస మొనర్ప యజ్ఞ పురుషత్వముడగు పాయసాన్న
ము । చ్చివరుననీవెలందులభుజింవనొనర్పుమటన్న శ్రీరమా । ధవు
డగు రామమూర్తిన్ మనదాపుగలంపు విచారమేటికిన్ ॥౪॥ తనదుని
జాంశ రాముడన దప్పక శేషనిజాంశ లక్ష్మణుం । డనగరథాంగశంఖవి
హితాంశములన్ భరతుంశత్రుఘ్నూ । దనుడనధాత్రిలోసిటు ము
ద-బున మానవరూపుడైజం । చినరఘు రామమూర్తిన్ మనచిం

కున్న ననురేంద్రలోకమునకుఁ జనెనన్న సహాయుటంచునె। మ్మన
మున చింతజేసి నియమంబుల శాస్త్రవిధుల్ పొసంగన। ట్టిఘనరా
మమూర్తి మనపీడలుబాపు విచారమేటికిన్ ॥ ౧౦ ॥ మనకుల పూ
ర్వులందరు క్రమంబుననేలు నయోధ్యపేరి శోభనమలరార రాజ్య
పరి పాలన శేయుమటంచు చాలమున్ననమధురోపమాన వచనంబుల
కైకకుమారుతోడనె। ప్పినఘన రామమూర్తి మనపీడలుబాపు వి
చారమేటికిన్ ॥ ౧౧ ॥ భరతుడు నీపదాబ్జములు బాళిపురంబున
కేగనన్ననన్। త్తరి గురు డానతిచ్చిన విధంబున పాదుకలిచ్చి సద్గుణా।
కరయిక బొమ్మటంచు బహుగా వినయంబొనరించు సద్దయా। పరు
డగు రామమూర్తి మనపాలగలండు విచారమేటికిన్॥ ౧౨॥ చిత్రవి
చిత్రమైన వనచిహ్నలు జూచుచు లక్ష్మణుండుభూ। పుత్రియు వెంట
రాగనట బోవుచు నొక్కెడ క్రమాలనున్నన। య్యత్రిమునీంద్రవుం
గవు నిజాశ్రమముం దగజేరునన్ముని। స్తోత్రుడు రామమూర్తి మన
తోడుగలండు విచారమేటికిన్॥ ౧౩ ॥ అతిశయభక్తినత్రి చరణాంబు
రుహంబుల మ్రొక్కి మాఘిచే। నతిథివిధుల్ గ్రహించి జనకాత్మజ కా
భరణంబు లామహా। న్నతునతి యాయుగాగొని వనంబులనింక
తిరించువేడ్క నుద్ధతిజను రామమూర్తి మనజంటగలండు విచారమే

## అరణ్యకాండ ప్రారంభము.

టికిన్॥ ౧౪॥ పుడమివడంక ఖేచరులు భూచరు లద్భుతమంద వెక్కు
డుం। దుమకు విరాధుడార్భటముతో నవనీసుత నట్టిబట్టి కా।రడవుల
బారఘోర విశిఖావళిచే జననీకభీతిజూ। పెడుఘనరామమూర్తిమన
పీడలుబాపు విచారమేటికిన్ ॥ ౧౫ ॥ అతిశయకోపుడైదనుజ డత్తరి
శిరనుడించిసోదరా। న్వితముగదన్ను బట్ట పృధివీధరమాయనులీలనే
లపై। జతికెలగూల్చియాతనికి శాపవిమోచనమాచరించుమో। చి
తుడగురామమూర్తిమన చింతలుబాపువిచారమేటికిన్ ॥ ౧౬॥ అటజని
కుంభసంభవమహా మునిసన్నిధిజేరి మ్రొక్కి ముచ్చటలెరిగించియా



ఘను వశంబునముండటన్మన్న గౌతమీ। తటిమహిమం బెఱింగి ప్ర
మదంబుననందరుదెంచుకార్యసం। ఘటనుడురామమూర్తి మనకార్య
ములిచ్చువిచారమేటికిన్ ॥ ౧౭ ॥ పావనమైజగంబులనుపర్వనదీసమ
మైజెలంగుగో। దావరిపొంత పంచవటిదాపునదా మొకపర్ణశాలమే।
ధావిధిగట్టిదీక్షయగు దాకనివాసమొనర్పబూనునన। ద్భావుడు రామ
మూర్తి మనపాలగలండు విచారమేటికిన్॥ ౧౮ ॥ అనుజుడు శేవసేయ
జనకాత్మజతో ననిశంబునావనం। బునవిహరింపుచున్ పళ్లముల్ ఫ
లముల్ భుజియింపుచున్ యధే। చ్ఛనునదియే యయోధ్యయను చం
దముబల్ సుఖలీలగావసిం। చినఘన రామమూర్తి మనచింతలుబాపువి
చారమేటికిన్॥ ౧౯॥ ఒకదినమందురావణ సహోదరియుండరుదెం
చిపుష్పసా।యకసుభ్రాంతయై కడునయంబుభయంబుల వేడనమ్మతిం।
చకమదిరోశిలక్ష్మణుని పాలికిబొమ్మని మాయబన్నసా। ధకుడగురా
మమూర్తిమనదాపుగలండు విచారమేటికిన్ ॥ ౨౦ ॥ నినుగనజాలనం
చు నవనీసుతపైకరుదెంచుదానవాం। గనదలించికర్ణములు నాశిక
మున్ విదళించుమంచుత। మ్మునకొకసైగగావెలిపి మొండెముగాదరి
గించుదుష్టఘ్న। దక్షుడగురామమూర్తి మనదంటగలండువిచారమేటి
కిన్ ॥ ౨౧ ॥ ఖరుడును దూషణుండు పదకొండుహితుల్ బదునాల్గువేల
దు। ష్కరదనుజుల్ మహోర్భటము గానికిన్ జనుదేర ఘోరసం। గ
రమొనరించిపెక్కు విశిఖంబుల క్రుక్కడగించుమించునే। ర్పరియగు
రామమూర్తిమనపాలగలండు విచారమేటికిన్॥ ౨౨॥ కనకకురంగరూ
పముటు గైకొనియుండరుదేరుదుష్టుదై। త్యునిగనిముందుగా గలఫిధుల్
మదినెంచి సతిన్ తిరోహితం। బొనరిచిమాయసీతనటనుంచి ప్రమో
దముగాజెలంగుమో। చనగలరామమూర్తిమనచక్కగలండు విచార
మేటికిన్ ॥ ౨౩॥ ఆయలనాగహేమమయమైనకురంగముజూచిప్రాణనా।
థాయదినాకుదెమ్మనిపదంబులపైబడి జాలిగావగల్। సేయదయాప్ర
పూర్ణమతిచెచ్చెరదెచ్చెదనంచుదానిడే। బోయినరామమూర్తిమనపా

షణ శేయు విచారమేటికిన్॥ ౧౪ ॥ దారుకశవామృగంబు బహుదూ
రముగాజనుదేర వెంటనే, మరక రయంబునన్ జని యమర్త్యవిరోధు
నిగానెరింగియు। త్రరికతీవ్రోగ్రసాయకముదగ్రతబూని విధించుమున్ససం।
హారుడగురామమూర్తిమన కాపద బాపువిచారమేటికిన్॥ ౧౫ ॥ ఎదుర
గుతమ్మునిన్గని మహీసుతనొంటరినుంచిరాగనో। ప్పదుపదుమంచుదీ
ప్రగతి పంచవటిఁ దగజేరిసీతలే। నిడియిలుజూచి హాయనియనేక వె
తల్ దలపోసి యాసతిఁ। వెదకిన రామమూర్తి మన వేధలుబాపు
విచారమేటికిఁ॥ ౧౬ ॥ పతితుడురావణుండు చరబట్టిమహీజను కొం
చుబోగనా। సతియడలంగ నడ్డపడి శక్తిదొలంగి సురారిపోటుచే। క్షితి
బటు నజ్జటాయువును జేరిసమగ్రముగా తదీయసం। స్థితివిను రామ
మూర్తిఁ మనదీనత బాపువిచారమేటికిఁ॥ ౧౭ ॥ సవినయవాక్యముల్
బలికి స్వామిహా శేయని మ్రొక్కియజ్జటా। యువుమృతుడైనకాలనియ
మోచిత కృత్యము లాచరించిమ। క్కవసకలామరోత్తములకుఁగ
నరాని పదంబొసంగుప్రా। భవుడగు రామమూర్తిఁ మనపాలగలండు
విచారమేటికిఁ॥ ౧౮ ॥ చనిచని యాకబంధునకు శాపవిమోచనమా
చరించికో। రినవరమిచ్చిముందు శబరిఁ కరుణించి క్రమంబునఁధ
రా। తనయను జాడలారయుచు తమ్ముడుతో నరుదేర వేగనే।గినఘన
రామమూర్తిఁ మనకీడులుబాపు విచారమేటికిఁ ॥ ౧౯ ॥ వనజహి

కిష్కింధాకాండ ప్రారంభము.

తాత్మజుండు తనవైరులుగా నెదభీతినొందిన। య్యనననిలాత్మజుఁబ
నుప నాకపియం దతడెంచి సన్నుదం। బునవినుతించిమ్రొక్కిన ప్ర
మోదత దీవెనలిచ్చి చాలమె। చ్చినఘన రామమూర్తి మనచింత
లుబాపు విచారమేటికిఁ ॥ ౨౦ ॥ అరవినందనాప్త సుగుణాళిసంతస
మంది ముచ్చటే। మారక దెల్పి యారవికుమారుని ముచ్చటెరింగి చె
ల్మిగా। గోరుచు ఋష్యమూకమునకుఁ హనుమంతుని వెంట దంట
గా। జేరిన రామమూర్తిఁ మనచింతలుబాపు విచారమేటికిఁ॥ ౨౧ ॥



అరవిజుండుభక్తి చరణాంబురుహంబుల మ్రొక్కి మక్కువఁ। గార
వమాచరించి తనకౌంగిట జేర్చుచు నీకువేగనే। దారనురాజ్యముఁ
బహు ముదంబులు గూర్చెదనంచు దుఃఖముల్। దీరుచు రామమూర్తిఁ
మనదీనత బాపు విచారమేటికిఁ॥ ౨౨ ॥ జనకసుతఁ జేరఁగొని నిశా
చరుడేగ మహీజనెమ్మనం। బున వెతగుందివైచు మణిభూషణముల్ క
పివీరులీయుడు। యనివిలకించి తోయజ దళాక్షిని దల్చి మరింత చిం
తజే। సినఘనరామమూర్తిఁ మనచింతలుబాపు విచారమేటికిఁ॥ ౨౩ ॥
వాలివధించుదుందుభి శవంబచటఁబడియున్న కాలిపైఁ। వ్రేలుసజి
మ్మితాళ ఫలవృక్షము లేడిటి నొక్కతూపునఁ। గూలిచి సూర్యనం
దనునకుఁ తనశక్తి దెరుంగ శేయుసం। శీలుడు రామమూర్తిఁమన
చింతలుబాపు విచారమేటికిఁ ॥ ౨౪ ॥ ఇనసుత కాలయాపన మికేటికి
నీవల వాలితోడబో। రొనరుపరమ్ము లెమ్ము సమరోచితముఁ దిల
కించివానిగ్ర। న్ననవధియింతునంచు రవినందను నాకపిరాజుపాలికిఁ।
గొనిచను రామమూర్తిఁ మనకోరికలిచ్చువిచారమేటికిఁ॥ ౨౫ ॥ అ
తులబలాఢ్యులా శతమఖాత్మజుడంబురుహాప్తపుత్రుడు। ద్ధతిహరియు
గ్మయోయను విధంబున ధీకొని బోరొనర్పవా। లితనువునంట సూటి
గశిలీముఖముఁ నిగుడించుజాలయో। చితుడగురామమూర్తిఁ మన
చింతలుబాపు విచారమేటికిఁ ॥ ౨౬ ॥ శరమున నేలగూలి పరుషంబు
లు బల్కు బలారిసూతిడ। గ్గరకరుదెంచి తెల్విగలుగఁ బహుబోధ
లొనర్చి దారకా। సరణి సుబోధలుఁ నెరిపి సద్గతి కాతనిబుచ్చు సద్ద
యా। పరుడగు రామమూర్తిఁ మనపాలగలండు విచారమేటికిఁ॥ ౨౭ ॥
కపికులరాజ్యసంపదకు కంజహితాత్మజురాజు జేశిన। త్కృపబురికంపివర్ష
ఋతుందిరెడునాటికి సీతజాడదే। నుపమలుగల్గుసాహస బలోన్నతుం
లఁగొనిరమ్మటంచుదీ। పపలుకురామమూర్తిఁ మనకాంతులొసంగు
విచారమేటికిఁ ॥ ౨౮ ॥ అనిశము నెమ్మనంబున ధరాత్మజపైవిరహాళి
గుండెతో। డనుపమభక్తియు క్తివినయంబులనాదరణంబొనర్పలె। క్క

నుదివసంబులొక్కొక యుగంబులెక్క ఘనకాలమెల్లబు । చ్చినఘన రామమూర్తిమన చింతలు బాపు విచారమేటికిన్ ॥ ౭౯ ॥ ఇనతనయుండు రాక డక్కొ కించుక మేరనతిక్రమింపనె । వ్వశముననంతసంబొదవ మూనినులన్ దగగూడియాడిమా । నెనో మనమీదనచ్చటికి నీవిపుడేజను మంచుదమ్మునిన్ । బనిపిన రామమూర్తిమన పాలగలండు విచారమేటికిన్ ॥ ౮౦ ॥ మిత్రకుమారుడయ్యెదను మిత్రకుమారునిగూడి కేసరి । పుత్రసలానిబానరులు పొంతదగన్ గొనియాడ నేగి భూ । పుత్రినిఁజూడ నం ఘదన భోగమునమన్నన శేయుభక్తస ॥ మిత్రుడు రామమూర్తిమన మేలొనగూర్చు విచారమేటికిన్ ॥ ౮౧ ॥ కనకనగేంద్రతుల్యులన గాదగు బెక్కు సహస్రకోట్లకా । ననచరసేనలన్ గని మనంబున నద్భుతమందిభానుసూ । నుని వినుతించి శీతనుగనుం గొనదోలుమటంచు నానతి । చ్చినఘనరామమూర్తిమన చింతలుబాపు విచారమేటికిన్ ॥ ౮౨ ॥ అతని సద్గుణాన్వితుడనౌ హనుమంతుని చెంతజేరియా । జాతనుఁజూచి రమ్మని వెసన్ దనయుంగరమానవాలుగా । బ్రీతినొసంగియాఘనుని పెద్దరికంబొనరించు సద్దయో । పేతుడు రామమూర్తి మన పీడలు బాపు విచారమేటికిన్ ॥ ౮౩ ॥ అతడటులేగి విఘ్నముల నంతకరావణు

## సుందర కాండ ఆరంభము.

లంకలో నభూ । సుత హడగాంచి దానవుల క్రుక్కడగించి పురిన్ దహించి వచ్చి తిననివచ్చికోమలి వచించు విధంబెరుగింప నంతసా । న్వితుడగు రామమూర్తిమన పీడలుబాపు విచారమేటికిన్ ॥ ౮౪ ॥ అనతిచేలిముద్రికరయంబున నాతడొసంగమెచ్చి శా । బాసని కౌంగలించి వెన భానుజ కౌంగిటజేర్చి నీదువిశ్వాసము మేలుమేలబల జూడ తెరింగితినంచు మన్ననల్ । జేసిన రామమూర్తిమన చింతలు బాపు విచారమేటికిన్ ॥ ౮౫ ॥

## యుద్ధకాండ ఆరంభము.

అనుపమశౌర్యులక్కతన యాంగదనీలనుషేణజాంబవ । త్పనసగవాక్షుమైందగజ తారసుహోత్రసునాధవాయుజుం । డిసేముఖకోట్లసంఖ్య



లవనాటులతో సమరాభిభోరసే । గిసఘనరామమూర్తిమన కీడులు బాపు విచారమేటికిన్ ॥ ౮౬ ॥ అలదశకంధరానుజుడు నన్నకుబుద్ధులు సెప్పబోయిన । న్నులబడి దన్నుజేరుమనోజుడు దయ సేయుమటంచు మ్రొక్క గా । చెలిమివహించి నిన్ను ప్రభు జేసెదలంక కటన్న సద్దయా । జలనిధి రామమూర్తిమన జంటగలండు విచారమేటికిన్ ॥ ౮౭ ॥ తోయధిచెంత జేరుతరి తోయధి మెచ్చుచు ముబ్బ్రరో వ్వేసి । తోయధినింక సేయుదని దొడ్డవడిన్ శరమూనవీనతన్ । తోయధిపాహిపాహియన తోయధినిన్ కరుణించు సద్దయా । తోయధి రామమూర్తిమన తోడుగలండువిచార మేటికిన్ ॥ ౮౮ ॥ అతరిబార్వతీరమణు నచ్చట వేడ్క ప్రతిష్ట జేసి ప్రఖ్యాతి సమస్తవానర సహాయమునన్ నలుచేత నబ్ధిపై । సేతువు గట్టబంచి కపిసేనలతో నదిదాటు సద్గుణో । పేతుడు రామమూర్తిమన పీడలు బాపు విచారమేటికిన్ ॥ ౮౯ ॥ అంతసువేలభూధరము నందొకవింతగచెంతనుండిహ । నుమంతుడు జూపలంకను సమస్త నిశాటుల జూచియాత్తనా । కింతవిచారమైసురల నేమిదిలక్ష్యమటంచు ధీ । మంతుడు రామమూర్తిమన మంచిదలంచు విచారమేటికిన్ ॥ ౯౦ ॥ అమరవిరోధిచెంత కమరాధిప శాత్రునిముందు తాయభారమున కునంపి వాడటు ధరాసుత నిచ్చుటకొప్పకున్న క్షాత్రము దసరారశయ్య మిక ధర్మము గానదనెంచు క్షాత్రధర్మమ్ము గల రామమూర్తి మనరక్షణశేయు విచారమేటికిన్ ॥ ౯౧ ॥ ఘనబలసాధనల్ దనర గానసధూరిను రారి సేనలన్ । దునుముడటంచు వానరుల తోశలవిచ్చి సుమిత్రబుత్రునా । ట్లనెబురిగోల్చి పెక్కు బలులన్ సమరోర్వి బెనంగి ధావధిం । చినఘన రామమూర్తి మన చింతలుబాపు విచారమేటికిన్ ॥ ౯౨ ॥ ఘనములడాగి కన్నులకు గానగరాక దశాననాత్మజుం । డనిమొననాగపాశముల నందరి బంధనశేయ పన్నగా । శనుసటుదల్చి దన్కహిమసర్పములన్ విదళించి మేలుగా । కొనురఘురామమూర్తి మనకోరికలిచ్చు విచారమేటికిన్ ॥ ౯౩ ॥ లక్ష్మికేల నేకకపులన్ నరులన్ బారి

గొంకుమంచు ధూమ్రాక్షుడ కంపనుండల ప్రహస్తముఖుల్ బహు
కోట్లు దీర్పగా। నక్షయభంజనాంగదనలాదులచే సమయింపసేయు
కోహోత్సుకు రామమూర్తి మీన కాపద బాపు విచారమేటికిన్ ॥ ౯౪ ॥
వాలిసుతాదిమర్కటుల వల్ల మహాహవశూరులౌచులన్। గూలుట
కల్గి రావణుడు ఘోరతరార్భటితోడ నెదిర్పవా। తూలము మేఘ
ముల్ బరప దోలువిధంబదలించు ప్రౌఢశా। ర్దూలుడు రామమూ
ర్తి మన తోడుగలండు విచారమేటికిన్ ॥ ౯౫ ॥ చండతరార్భటుల్
జెలగ శైలచరాళిని ద్రింగుచున్ మహా। ద్దండుడు కుంభకర్ణుడటు
దార్కొని పోరొనరింప ఘోరకో। దండమునెత్తి యూఖలుని తత్క్షణ
మాత్రమె ద్రుంచు శౌర్యద। క్షుండగు రామమూర్తి మనజోడుగ
లండు విచారమేటికిన్ ॥ ౯౬ ॥ అంతదశాననాజ్ఞ నునరాంతకు డాత
నిసోదరుండు దేవాంతకుడింక పెక్కులుమహాహవదక్షులుధిక్క
రింపన। త్రాంతకముఖ్యవానరుల నంపి సురారుల ద్రుంపసేయుధీమం
తుడు రామమూర్తి మనమంచిదలంచు విచారమేటికిన్ ॥ ౯౭ ॥ కక్ష
వహించి ప్రౌఢుడతికాయుడు వీడతికాయుడేననన్। లక్షలకోట్లరా
క్షసబలంబులతో నని కేగవేగని। ర్లక్షత వారినందరను లక్ష్మణుచేనని
గూలచేయుబల్। దీక్షుడు రామమూర్తి మన దీనత బాపువిచారమే
టికిన్ ॥ ౯౮ ॥ అనుపమశూరుడింద్రజితుడత్తరి దెబ్బలడంపవాయు
నం। దనుడటు దెచ్చునౌషధమునన్ దగదేరి దినేంద్రసూనుయోధ
నగోనివీడుగాల్చుటకు శైలచరావళికెల్ల నాజ్ఞలి। చ్చినఘనరామ
మూర్తి మనచింతలు బాపు విచారమేటికిన్ ॥ ౯౯ ॥ అనివరవానరా
ధముల నంతరిద్రింగెద మంచుకుంభక। ర్ణునిదనయుల్ మహాబలవతు
ల్ జనుదేర సమీరజార్కనం। దనముఖ మర్కటాళివలనన్ హతోజ్జ్వ
లులుగా నొనర్పజే। సినఘన రామమూర్తి మనచింతలు బాపు విచా
రమేటికిన్ ॥ ౧౦౦ ॥ ఖరదనుజాత్మజుండు బహుగాదనుజుల్ దనవెంట
నంటరా నరులను దాకిమోహార మొనర్పమహాన్నుకలీల ఘోర



తోమరముల గుప్పితద్దళ సమన్విత మాఖలునిన్ వధించునే। ర్పరి
యగు రామ మూర్తి మన పాలగలండు విచారమేటికిన్ ॥ ౧౦౧ ॥
హాహామమొనర్చియగ్ని మహాహూస్త్రశక్తిమునున్ గ్రహించి
బ్రూ। ర్వామర ఘాట్సుతుండగ చరావళి నారటబుచ్చదక్షణం। బా
మును కృత్తిమంబడచి యాతనిభంగమొనర్చు సద్గుణ। స్తోముడురా
మమూర్తి మనతోడుగలండు విచారమేటికిన్ ॥ ౧౦౨ ॥ జానకిబో
లె వేరనొక దాన నిరూపణజేసి శక్రజి। త్తానలినాశ్తవిన్ దునుమనా
త్మననేక తలంపు లూరగా। నానిజమంతయున్ దెలిసి యూరథశాస
నమంచు ధైర్యమున్। బూనిన రామమూర్తి మన పోషణసేయు వి
చారమేటికిన్ ॥ ౧౦౩ ॥ మరలనతండొనర్చు నియమంబు సమాప్తినొ
నర్పనీకవ। త్తరి జరుసంగ బంచితన తమ్మునికిన్ శలవిచ్చి ఘోరసంగర
మున నామహాత్మువలనన్ ఘననాదుని జంపసేయునే। ర్పరియగు రామ
మూర్తి మనపాలగలండు విచారమేటికిన్ ॥ ౧౦౪ ॥ కోడుకురణంబు
లో దెగుటకున్ దశకంఠుడనేకభంగులన్। మిడికిమహాపరాక్రమయు
తుల పెక్కలనంపనంత నొక్కడెయెదిరించి ఘోర విశిఖంబుల
పాలొనరించు శౌర్యదక్షుడు ఘన రామమూర్తి మనజోడుగలండు
విచారమేటికిన్ ॥ ౧౦౫ ॥ మూలబలంబులిట్లు సహమూలముగాహత
మైన పెక్కుడై। త్యాలినుతింప ఘోరత దశాననుడాల మొనర్పన
త్తరిన్। వాలిసుతాదిమర్కటుల వల్ల సుపార్శ్వముఖాదియోధు
లన్। గూలుచు రామమూర్తి మన కోరికలిచ్చు విచారమేటికిన్ ॥
౧౦౬ ॥ ఘనమగు శక్తిబూని దశకంఠుడు లక్ష్మణునేసి మూర్ఛపా।
లొనరుప నాత్మసంశయము నొందుచు ధైర్యస్వభావలంబుదై। యనిమి
షవైరినవ్విత శరాంబుధిముంచియదల్చుమించునా। ధనగల రామ
మూర్తి మన జంటగలండు విచారమేటికిన్ ॥ ౧౦౭ ॥ ధరణివిచేష్టుడై బ
డిన తమ్ముని కౌంగిట జేర్చి హా సహోదరా। దరనిన్ను బాసిపేనటుల శో
కపుదుఃఖపయోధి దాటనే। దరియిక నాకటంచు ఘనుడు దైన్యతమా

### పఠనాదివిశేషము.

ఇదివఠియించువుమానవులకీకృతికల్పితమనట్లుకాలెనా। పదలువారింపసేయుచుశుభంబులొసంగిసిరంతరంబును। న్నదమునబ్రోచియంత్యామునమోక్షసుఖంబొనగూర్చునద్దయా। న్పదుడగురామమూర్తిమునవాలగలండువిచారమేటికిన్॥౧౧౦॥

---

శ్రీరామకథా ప్రతిపాదక ధైర్యశతకము

సంపూర్ణము.

---



శ్రీ

## ప్రకటన.

---

ఈదిగువనవ్రాయబడినశతకములు కేవలభక్తిరసముగా బహుమంచిగానున్నవి. ఎడమవైపు వ్రాయబడినగ్రంథములు ప్రస్తుతం రచియింపబడినవి యిందులోస్వాతత్యం చిత్తగించగా విశదంకాగలదు పేదవనిచ్ఛయించెదు నాముఖ్యసఖులు మొదలియినవారికి తగుమాత్రం స్వల్పప్రతులు నావలన అచ్చుకూర్పింపబడినవి అచ్చుకుపూర్వమే వీటియొక్కయు యింతకు పూర్వం నాచేరచియింపంబడి సర్వధారినామసంవత్సరములో అచ్చుకూర్పింపబడి కావలయువారికి వెలలేకుండా పంపగలనని ఆయాపుస్తకములయందే ప్రకటనవ్రాయబడి ఆప్రకారంవ్రయం కాబడినశతకములు అనగా యీదిగువవ కుడివైపు అగుపచ్చిన వాటియొక్కయు భక్తిరసము స్వాతంత్ర్యమును చూచి సార్వకాలమున్ను అచ్చుకూర్పించుక విక్రయపరుస్తు లాభమును సంపాదించుటకు నేకొరకు కొందరువర్తకులు మొదలయినవారు సర్కారువారి ఆక్టుప్రకారం తమపేరట రిజిష్టర్ చేసి యివ్వవలెనని బహుగాకోరియుందురుగాని ఆప్రకారం ఒక్కరియందే స్వాతంత్ర్యం పెట్టడంలో ఇతరులకు అధికారంలేనందున కొంతకాలం పిమ్మట గ్రంథములకు నష్టంసంభవించునని సందేహంవలన ఎవరికిన్ని రిజిష్టర్ చేయబడియుండదు. ఈగ్రంథములనుంచి ద్రవ్యలాభాభిలాషులైన వర్తకులేకాని ముద్రాక్షరశాలాధికారులేకాని కీర్తివిశేషమున కిచ్ఛయించెదు భగవద్భక్తులు మొదలయినవారలేకాని ఈ యావత్తుగ్రంథములున్ను తమతమ ఇష్టానుసారంగా వలయునప్పుడల్లా అచ్చుకూర్పించుకొనుటకు నిండా స్వాతంత్ర్యంవుండగలదు నావలన ఆటంకం యెంతమాత్రంలేదు యేవిధంవలనైనాగాని గ్రంథప్రచురమునకు సహాయులైన సత్పురుషులనుగురించి నిండా ప్రార్థించుచున్నాడను.

---

౧ శ్రీరంగశతకం సీసపద్యములు అంత్య నేమములు అచ్చటచ్చట మ్లేంఛశబ్దములు కూడా కూర్చబడినది.

౧ శ్రీరామకథాప్రతి పాదకధైర్యశతకం ఉత్పల మాలలు చంపకమాలలు రామాయణ కథానుసారముగా ప్రతికాలములో పఠనకు తగినదిగానున్నది.

౧ శ్రీకృష్ణకథా ప్రతిపాదక ధైర్యశతకం ఉత్పల మాలలు చంపకమాలలు భాగవతదసమస్కంధ కథానుసారముగా పఠనకు తగినదిగా నున్నది. పూర్వంలో స్వల్ప ప్రతులు అచ్చువేయింపంబడి వ్రయం అయినందున యిప్పుడు పునహా అచ్చువేయింపబడినది.

౧ విశ్వేశ్వరశతకం శార్దూల మత్తేభవృత్తములు ఈశ్వరపరం.

౧ సర్వసంబోధన కృష్ణశతకం కందపద్యములు.

౧ శ్రీహరిశతకం ఉత్పలమాలలు చంపకములు,

౧ హనుమంతశతకం కందపద్యములు రకారప్రాస.

౧ జీడికంటిరామశతకం కందపద్యములు రకారప్రాస.

౧ లక్ష్మీశతకం కందపద్యములు.

౧ శ్రీకృష్ణనామాంకిత స్త్రీవిరహ సీసశతకం.

---

గ్రంథకర్త.

అన్నగారి వెంకటకిషన్‌రావు,
హాలుమొకాం, బాగు
అంబరుపేట, హాయిదరాబాదు
దఖ్ఖన్.

# తప్పొప్పులు.

| పుటసంఖ్య | పద్యసంఖ్య | పంక్తిసంఖ్య | తప్పు. | వప్పు. |
|---|---|---|---|---|
| ౧ | ౩ | ౮ | దినీశ | దినేశ |
| ౧ | ౪ | ౧౨ | పురుషత్వముదగు | పురుషత్వముగాదగు |
| ౧ | ౫ | ౧౬ | దబున | దంబున |
| ౨ | ౧౦ | ౧౬ | నల్లు | నట్లు |
| ౩ | ౧౭ | ౧౬ | సంతసించినరామమూర్తి | సంతసించినఘనరామమూర్తి |
| ౫ | ౩౪ | ౨౪ | సమ్మదపడు | సన్ముదపడు |
| ౬ | ౩౬ | ౩ | అమకు | అమ్మకు |
| ౬ | ౩౭ | ౯ | పుతిని | పుత్రిని |
| ౬ | ౪౦ | ౧౮ | నేగడు | నేగుడు |
| ౬ | ౪౦ | ౧౯ | కింకసు | కింకనను |
| ౬ | ౪౨ | ౨౬ | డవుట | డొాట |
| ౬ | ౪౨ | ౨౬ | జాం | జాల |
| ౭ | ౪౪ | ౫ | శబరి | శబర |
| ౭ | ౪౪ | ౫ | దాయెునర్ప | దాటానర్ప: |
| ౭ | ౪౬ | ౧౪ | చిత్రకూటముఙ్గైకొనియచ్చటఙ్నిలువగాదగునంచు | చిత్రకూటమందాకరమంచునిల్వదగునంచు |
| ౭ | ౪౭ | ౧౬ | వేయబో | వేయగా |
| ౮ | ౫౪ | ౧౫ | మానిచే | మానిచే |
| ౮ | ౫౪ | ౧౭ | జంట | దంట |
| ౯ | ౫౭ | ౨ | కార్య | కామ్య |
| ౯ | ౬౦ | ౧౦ | బకదిన | ఒకదిన |
| ౧౦ | ౬౫ | ౩ | విధించు | వధించు |
| ౧౨ | ౮౦ | ౨ | ఇనతనయు | తనయుం |
| ౧౨ | ౮౧ | ౬ | కేసరి | కేసరీ |

| పుటసంఖ్య | పద్యసంఖ్య | పంక్తిసంఖ్య | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| ౧౨ | ౮౧ | ౮ | పభో | ప్రభో |
| ౧౨ | ౮౨ | ౯ | తుల్వ | తుల్య |
| ౧౨ | ౮౩ | ౧౩ | యూజాతను | భూజాతను |
| ౧౨ | ౮౫ | ౨౦ | ఆసితిచేతిముద్రిక | ఆసతియానవాలును |
| ౧౨ | ౮౫ | ౨౧ | దేర్చి | జేర్చి |
| ౧౩ | ౮౭ | ౩ | దస్నులబడి | దెప్పలబడి |
| ౧౩ | ౮౭ | ౩ | ననుక్షదయసేయు | ప్రభోదయశేయు |
| ౧౩ | ౮౯ | ౧౪ | లత్యామటంచుధీమంతుడు | లత్యామటంచూనెంచుధీమంతుడు |
| ౧౩ | ౯౧ | ౧౭ | శయ్యామిక | కయ్యామిక |
| ౧౪ | ౯౫ | ౬ | ముల్బరవ | ముక్బరవ |
| ౧౫ | ౧౦౬ | ౧౯ | వాలిసురాది | వాలిసుతాది |
| ౧౫ | ౧౦౭ | ౨౨ | సభావలంబుడై | సద్భావలంబుడై |
| ౧౬ | ౧౧౨ | ౧౨ | అన్ని | అగ్ని |
| ౧౬ | ౧౧౩ | ౧౮ | నానినమఃఖంబున | వాని |
| ౧౬ | ౧౧౪ | ౨౨ | గుడిపించు | నిగుడించు |
| ౧౬ | ౧౧౫ | ౨౫ | విదలించు | విదళించు |
| ౧౬ | ౧౧౫ | ౨౬ | నేర్పరితుడగు | నేర్పరియగు |
| ౧౭ | ౧౧౬ | ౨ | విభీమ | విభీష |
| ౧౭ | ౧౧౮ | ౮ | బ్రయాంగనల్ | బ్రియాంగనల్ |
| ౧౭ | ౧౧౯ | ౧౨ | వులెల్ల | వులెల్ల |
| ౧౮ | ౧౨౫ | ౭ | నమానినులై | సమానినులై |
| ౧౮ | ౧౨౭ | ౧౬ | జాలయోచన | యోచన |
| ౧౯ | ౧౩౩ | ౯ | ధరణీ | క్ష్మాధరణీ |
| ౧౯ | ౧౩౬ | ౨౨ | సద్దుణో | సద్గుణో |
| ౨౧ | ౧౪౮ | ౧౩ | ఈమెడ | ఏమెడ |

